ఓ౩మ్

# వైదిక ధర్మ్మము

మాస పత్రిక

మనుర్భవ జనయా దైవ్యం జనమ్ (ఋగ్వే. ౧౦-౫౩-౬)

మానవుడ వగుము. దివ్యగుణములుగల మానవుని నిర్మింపుము


| సంపుటి | సౌర నభస్ | సంచిక |
| --- | --- | --- |
| ౩+౧౧ | (శ్రావణము ౧౯౨౩ శా. సం.) ౨౦౫౮ వి. సం. | ౨ |




# సంస్కారముల మహత్త్వము

విశేష సంచిక


రచయిత

**ఆచార్య వేదవ్రత మీమాంసక**

ఆర్షగురుకులము, వడ్లూరు, కామారెడ్డి, జిల్లా ఇందూరు.



సంపాదకులు

**ఆచార్య వేదవ్రత మీమాంసక**

ప్రకాశకుడు

**మనస్వీ**

ఆర్షగురుకులము, వడ్లూరు, కామారెడ్డి, జిల్లా ఇందూరు - ౫౦౩ ౧౧౧

ఓం

# సంస్కారముల యొక్క మహత్త్వము

మానవుడు శరీరము, మనస్సు, వాక్కు అను త్రివిధ సాధనములతో కర్మలొనర్చును. వీటిని త్రికరణములందురు. త్రికరణములతో నిర్వహించ బడిన కర్మలు త్రివిధములు. ౧ శుభకర్మలు, ౨ అశుభకర్మలు, ౩ శుభా శుభకర్మలు, త్రికరణములతో చేయబడిన ఇట్టి కర్మల ప్రభావము మానవుని శరీరముపైన, ఆత్మపైన పడును. వాటినే సంస్కారము లందురు.

ఏ క్రియల వలన ఆత్మ మరియు శరీరము సద్గుణములతో సంయుక్త మగునో, దుర్గుణముల నుండి వియుక్త మగునో వానిని సంస్కారము లందురు. ఆత్మపైనను, శరీరముపైనను పడు ప్రభావమును సంస్కార మందురు. సంస్కారమనగా ఒకానొక పదార్థమునందు గుణములను ప్రవేశపెట్టుట లేదా దోషములను తొలగించుట. ఉదా : ఆద్య శంకరా చార్యుడు వేదాంత దర్శన భాష్యమున సంస్కార శబ్దమున కర్థము నీ విధముగా వ్రాసెను. "సంస్కారో నామ సంస్కార్యస్య గుణాధానేన వా స్యాత్ దోషాపనయనేన వా." ౧-౧-౪ సంస్కరించ దగిన దానియందు గుణములను చేర్చుటచే గాని దోషములను తొలగించుటచేగాని జరుగు మార్పు సంస్కార మనబడును.

భూమిని సమతలము చేసి, దున్ని, గడ్డి మున్నగు వానిని తొలగించి పంట కనుకూలము చేయుట భూమి సంస్కార మనబడును. సంస్కరింప బడని భూమికన్న సంస్కరింపబడిన భూమి యొక్క మూల్య మధికము. ముడికర్ర కన్న సంస్కరింపబడిన కర్ర మూల్య మధికము. ముడి కర్రను తలుపులుగా సంస్కరించిన తరువాత దాని విలువ పెరుగును. వడ్లకన్న బియ్యము విలువ అధికము. దేనివలన మూల్య మధికమగునో దానిని సంస్కార మందురు. విద్యావిజ్ఞానము లేని మానవుని కన్న, అవి గల మానవుని మూల్య మధికము. విద్యచే సంస్కరింపబడిన మానవుని సామర్థ్యము అధికము. విద్యచే మానవుడు సంస్కరింపబడును. దానిచే అతని విలువ అధికమగును. ఈ విద్యయే సంస్కారము. ఆ సంస్కారము

వలన అతని సామర్థ్య మభివృద్ధిచెందినది. అట్లే షోడశ సంస్కారములవలన మానవుని శరీరము, వాక్కు, మనస్సు, బుద్ధి సంస్కరింపబడును. అట్లు సంస్కరింపబడిన మానవుని శరీరము, వాక్కు, మనస్సు, బుద్ధి, ఆత్మబలము సమున్నత మగును. అతడు తన ఉన్నతితోపాటు ఇతరుల యున్నతిని, సమాజోన్నతిని, దేశోన్నతిని సాధించగల్గును.

మహర్షి దయానందుని వలన శ్యాంజీ కృష్ణవర్మ మహాదేవ గోవింద రానాడే, పంజాబుకేసరి లాలా లజపతరాయ, దేవతా స్వరూప భాయి పరమానందుడు, స్వామి శ్రద్ధానందుడు, బాల గంగాధర తిలక మున్నగు వారు సంస్కరింపబడిరి. వారివలన రాంప్రసాద బిస్మిల, భగతసింహుడు, చంద్రశేఖర ఆజాదు మున్నగువారు సంస్కరింపబడిరి. రాంప్రసాద బిస్మిల వలన అశఫాకఉల్లాఖాన, రోశనసింహ, రాజేంద్రలాహిరి మున్నగువారు సంస్కరింపబడిరి. వీరు సంస్కరింపబడి దేశ స్వాతంత్ర్యముకొరకు పోరాడిరి. చివరికి ఉరిశిక్ష ననుభవించిరి. వీరు సంస్కారములచేతనే ఇంత ఆత్మోన్నతిని సంపాదించిరి. దేశోన్నతికొరకు పాటుపడగలిగిరి. ఇది సంస్కారముల మహత్త్వమే.

మహర్షి దయానందునివలన సంస్కరింపబడి దేశభక్తులైనవారు ఆంగ్లేయులతో పోరాడి దేశమును రక్షించిరి, స్వామి శ్రద్ధానందుడు, లాలా లజపతిరాయ మున్నగువారు ఈ దేశముపై అనంతకాలమువరకు రాజ్యము చేయుటకు ఆంగ్లేయులు చేసిన కుటిలకుతంత్రములను విధ్వంసము చేసిరి. ఇది సంస్కారముల మహత్త్వమే.

మను మహర్షి సంస్కారముల ప్రభావమును పేర్కొనుచు నిటుల వ్రాసెను.

గార్భైర్ హోమైర్ జాతకర్మచౌడమౌంజీనిబంధనైః ।
బైజికం గార్భికం చైనో ద్విజానామపమృజ్యతే ॥ ౨-౨౭ ॥

గర్భమునందు జరుపబడు గర్భాధానము, పుంసవనము, సీమంతోన్న యనముల చేతను జాతకర్మ చూడాకర్మ మౌంజీనిబంధన (ఉపనయన) సంస్కారముల చేతను బీజ (వీర్య) దోషము మరియు గర్భము వలన సంభవించిన దోషములు తొలగిపోవును.

దీనితో మానవుని శరీర దోషములు సంస్కారములవలన తొలగి పోవునని తెలియుచున్నది. అదే విధమున ఆత్మయందు గల దోషములు దూరమగును. ఉత్తమ గుణములు సంక్రమించును.

మానవ జీవనము సంస్కారములచే నిష్పన్నమగు నని తెలిసికొని యుంటిమి. అందులో గర్భాధానము మొదలుకొని అంత్య సంస్కారము వరకు షోడశ సంస్కారము లుండును. తరువాత తరువాత సంస్కారముల కన్న పూర్వ పూర్వ సంస్కారమువలన కలుగు ప్రభావ మధికము. వానిచే సంస్కరింపబడు మానవుని శరీరాత్మలు అత్యధికముగా సంస్కృతమగును. **ఉదా**: నీటివలన, ఎరువువలన పురాతన వృక్షమునకు కలుగు హితముకన్న అంకురావస్థలో నున్న వృక్షమున కధిక హితము కలుగును. నవీన వృక్షము వికసించినంతగా పురాతన వృక్షము వికసించదు. అంకురావస్థలో నున్నపు డధికముగా వికసించును. చిన్న వయసున నున్న స్మృతి పెద్దవయసున గోచరించదు. చిన్నవాడు నాటిన బీజములవలె పెద్దవయసున బీజములను నాట జాలము. అట్లే ఉత్తరోత్తర సంస్కారములవలన కలుగు హితముకన్న పూర్వ పూర్వ సంస్కారములవలన కలుగు హితము అధికము. దీనివలన సంస్కారములలో తారతమ్యము తెలియగలదు.

## షోడశ సంస్కారములు

౧ ప్రాగ్జన్మ, ౨ శైశవ, ౩ శైక్షణిక, ౪ వివాహ, ౫ వానప్రస్థ, ౬ సంన్యాస, ౭ అంత్యేష్టి లని సప్తవిధములు. శిశువు జన్మమునకు పూర్వము గావించబడు గర్భాధాన, పుంసవన, సీమంతోన్నయనములు జననమునకు పూర్వము గావించబడుటచే ప్రాగ్జన్మము లనబడును. శిశువు జననానంతరము గావించబడు జాతకర్మ, నామకరణ, నిష్క్రమణ, అన్నప్రాశన, చూడాకర్మ కర్ణవేధ లను నీ ఆరు సంస్కారములు జననము తరువాత శైశవములో జరుపబడుటచే శైశవము లనబడును.

శిక్షణకు సంబంధించి సంపన్నము చేయబడు ఉపనయనము, వేదారంభము, సమావర్తనము లనబడు నీ మూడు సంస్కారములు శైక్షణికము లనబడును. గృహాశ్రమమున ప్రవేశించుట కొనర్చబడు సంస్కారము వివాహ సంస్కారము. గృహాశ్రమమును ముగించి వనములో నివసించుచు,

యోగమునభ్యసించుచు తపోమయ జీవనము గడుపుటకు గ్రహించబడు సంస్కారము వానప్రస్థ సంస్కార మనబడును. యోగమున నిష్ణాతుడై ఆత్మ పరమాత్మల నెరిగి సమస్త లోకోపకారార్థము పరివ్రజనము కొరకు గ్రహించబడు సంస్కారము సంన్యాస మనబడును. మృత్యువు తరువాత శరీరము కొరకు జరుపబడు సంస్కారము అంత్యేష్టి యనబడును.

## ౧ గర్భాధానము

ఉత్తమ మానవ నిర్మాణార్థము చేయబడు ప్రయత్నములలో ప్రథమ ప్రయత్నము గర్భాధానము. దీనిని గర్భా లంభనము, గర్భధారణము, పుత్రేష్టి, ఋతు గమనము, చతుర్థీకర్మ అనియు పేర్కొందురు. పుత్రకాములగు స్త్రీ, పురుషులు వివిధ గుణములు గల సంతానమును. **ఉదా:**- బ్రాహ్మణుడు, శ్రోత్రియుడు. అనూచానుడు, ఋషికల్పుడు, ఋషి, క్షాత్రతేజస్సుగల ధీరుడు, వీరుడు, శూరుడు, ధన ధాన్యపశు సంపదగల ధనంజయుడు మున్నగు రూపములోగోరుదురు. దాని కనువగునటుల తమ శరీరాత్మమనోబలము లను, వస్తుజాలమును సమకూర్చుకొందురు. ఉత్తమ సంతానమును గోరుచు అనుకూలమైన దినమున విద్వాంసులను, పూజ్యులను, బంధుమిత్రులను ఆహ్వానింతురు. వారి సమక్షమున తమ పునీత భావములను సాకారము చేయు సంకల్పముతో నీ సంస్కారమును సలుపుదురు. ఈ సంస్కారమున తాము వాంఛించు మహోన్నత అభిలాష సఫలమగునటుల విద్వాంసులు, వృద్ధులు, బంధుమిత్రులు మున్నగు వారి ఆశీస్సుల బడయుదురు. పూజ్యుల ఆశీర్వచనములను పొందిన ఆ పుణ్య దంపతులు ఆయుర్వేద విధి ననుసరించి రాత్రియందు గర్భాధానము గావింతురు. ఉత్తమ మానవ నిర్మాణమునకు మానవ సమాజము నుద్ధరించగల మహా పురుషుల ఆవాహనమునకు, సుగుణులైన మతిమంతుల కీ సంస్కారము ఒక పవిత్ర కృత్యము. ఇది అశ్లీలము కాదు. దీనిని కామక్రీడగా భావించువారి కిది పరమాశ్లీలము. ఈ సంస్కారము ఆయుర్వేదము ననుసరించి :

ధ్రువం చతుర్ణాం సాన్నిధ్యాత్ గర్భః స్యాద్విధిపూర్వకః ।
ఋతు క్షేత్రాంబు బీజానాం సంయోగాదం కురో యథా ॥

ఋతువు, క్షేత్రము, అంబు (నీరు) బీజమను నీ నాలుగింటి విధి పూర్వక సంయోగము వలన అంకురము ఉత్పన్నము అగునటుల దంపతుల ఋతువు, క్షేత్రము, అంబు, బీజముల విధి పూర్వక సంయోగమువలన సంతానము జన్మించును. ఈ చతుష్టయమును దోషరహితము గావించి ఆయుర్వేద విధి ననుసరించి గర్భాధానము జరిగెనేని దంపతులు ఆశించిన విధముగా వారికి ఉత్తమ సంతానము కలుగుట నిశ్చితము. విధిపూర్వకముగా చేసిన ఉద్యానవనము వలె ఆ సంతానము ఉత్తమ గుణములతో నలరారును. ఈ సంస్కారము లేక కలుగు సంతానము అడవిలో జన్మించిన వృక్షములవలె నుండును.

**ఋతువు :-** ఋతుస్నానము తదుపరి చతుర్థ రాత్రి నుండి షోడశ రాత్రి వరకు ఋతు కాలము. అందులో ౫,౭,౯,౧౧,౧౫ రాత్రులు స్త్రీ సంతానము కొరకు ౪, ౬, ౮, ౧౦, ౧౨, ౧౪, ౧౬ రాత్రులు పుత్రసంతానము కొరకు యోగ్యము. అందులో ఉత్తరోత్తర రాత్రులందు గర్భాధానము ఐన యెడల శ్రేష్ఠము, ఐదవ రాత్రికన్న, ఏడవరాత్రి శ్రేష్ఠము, ౧౫ వ రాత్రి స్త్రీ సంతానము కొరకు సర్వశ్రేష్ఠము. పురుష సంతానము కొరకు ౧౬ వ రాత్రి సర్వశ్రేష్ఠము.

**క్షేత్రమనగా గర్భాశయము :-** గర్భాశయము రోగరహితమై ఉండవల యును. దోష ముండెనేని సంతానము కాదు.

**అంబు (నీరు) :-** రజస్సు ప్రతి మాసము గర్భాశయమును ప్రక్షాళన చేసి శుద్ధము చేయుచుండును, గర్భధారణము తర్వాత అది గర్భస్థ శిశువునకు, వృక్షమునకు జలము వలె పుష్టిని గలిగించును. ఈ పుష్టి జరుగని యెడల గర్భములో శిశువు శరీరము వికసించదు.

**బీజము :-** దంపతులిరువురి బీజములు రోగరహితమై, బలిష్ఠమై యుండ వలయును. రజో వీర్యములలో ఏ యొకరి బీజము సదోషమైనా సంతానము జరుగదు.

ఈ చతుర్విధ సంపదలతో పాటు దంపతులలో పవిత్ర ధ్యేయము, సదాచారము, సంయమము, పరోపకారము, ఈశ్వర భక్తి మున్నగు గుణము లున్న యెడల ఉత్తమ సంతాన మగును.

## ౨ పుంసవనము

గర్భము ధరించిన తరువాత నిర్వహింపబడు ఈ సంస్కారమును పుంసవన మందురు, పుం అనగా బలము, సవన మనగా ఉత్పన్నము చేయుట, పుంసవన మనగా బలమును పెంపొందించు కొనుటయని అర్థము.

గర్భము ధరించిన తదుపరి దంపతులు తమ బలమును పెంచు కొనుటకు శ్రద్ధతో, నిష్ఠతో బ్రహ్మచర్యమును పాటించుట అవసరము. గర్భమును ధరించిన నాటినుండి ఒక సంవత్సరము వరకు దంపతులు స్వప్నములో కూడా బ్రహ్మచర్యమును భంగము కానివ్వగూడదు. దానివలన ఇరువురిలో బల మభివృద్ధిజెందును.

గర్భవతి గర్భస్థ శిశువును అతి జాగ్రత్తతో రక్షించ వలయును. అభివృద్ధి జేయవలయును. శరీరమున కనుకూలము, పుష్టిప్రదము, రోగనివారకము లగు పదార్థములను ప్రయత్నముతో సేవించవలయును. నిరంతరము శిశువు యొక్క శరీర వికాసమున కనుకూలమగు ఆహారముతోపాటు అనుకూల మగు ఆచారము ననుసరించ వలయును.

గర్భము స్థిరమైన తదుపరి దానిని రక్షించుట ఉత్తమ మానవ నిర్మాణములో ద్వితీయ కర్తవ్యము. ఆ గర్భము రోగరహితమై క్రమముగా అభివృద్ధి చెందుట కవసరమగు కర్మ ఈ సంస్కారముతో ప్రారంభమగును. వటవృక్షముయొక్క జట లేక దాని లేత ఆకుల రసమును గర్భిణి దక్షిణ నాసాపుట ములో వేయవలయును. షమృత వల్లి (బ్రాహ్మి) మున్నగు ఔషధములను ఆమె సేవించవలయును. దీనితో గర్భము రోగరహితము, బలిష్ఠము నగును. ఈ సంస్కారము వలన గర్భపాతము సంభవించుటకు గల దోషములు శమించును.

కేవలము స్త్రీ సంతానమునే పొందుచున్న మహిళలు గర్భాధానానంత రము మొదలు కొని ప్రసవము వరకు కొన్ని ఔషధములను సేవించిన యెడల వారికి పురుష సంతానము కలుగును. అందుకు కూడా ఈ సంస్కారము సహకరించును.

ఈ నాటి విజ్ఞానమున కింతవర కీ విషయము దృష్టికి రాలేదు. ఏలన నేటి వైజ్ఞానికులు గర్భధారణానంతరము ఇది అసంభవమని నమ్మెదురు, ప్రతి పాదింతురు.

"ఇదం హి నః ప్రత్యక్షం" ఇది మా అనుభూతము. అనేక గర్భిణీ స్త్రీలపై ప్రయోగించి సఫలత సాధించి తెలిసికొన్న విషయము. దీనిని కాదనుట అపరీక్షితము. దీనిని ఎవరైన పరీక్షించవచ్చును.

## 3 సీమంతోన్నయనము

దీనిని సీమంతమనియు వ్యవహరింతురు. మానవుని శిరస్సునందు పంచ (ఐదు) అస్థి సంధులు గలవు. శిరస్సు పంచ సంధులలో విభక్తమై యున్నది. ఆసంధులే సీమంతము లనబడును. మస్తిష్కమునందే మేధా (మెదడు) సురక్షితమై యుండును. ఆ సీమంతముల ఉన్నయనము = ఉత్కర్షము = అభివృద్ధి సీమంతోన్నయన మనబడును.

పుంసవనము ద్వారా గర్భిణీ తన గర్భమును శారీరకముగా సమున్నతము చేయనారంభించును. ఆమె ఈ సీమంతోన్నయన సంస్కారము జరుపుకొని గర్భము యొక్క మానసికోన్నతికొరకు ప్రయత్నించును. ఇది చతుర్థ మాసమున, షష్ఠమాసమున, అష్టమ మాసమున నిర్వహించబడును. గర్భము గూర్చి సుశ్రుత సంహితయం దిటుల పేర్కొనబడినది.

చతుర్థే సర్వాంగ ప్రత్యంగ విభాగః ప్రవ్యక్తో భవతి, గర్భ హృదయ ప్రవ్యక్తీ భావాచ్చేతనా ధాతురభివ్యక్తో భవతి, పంచమే మనః ప్రబుద్ధతరం భవతి, షష్ఠేబుద్ధిః, సప్తమే సర్వాంగ ప్రత్యంగవిభాగః ప్రవ్యక్తతరః, అష్టమే స్థిరో భవత్యోజః తత్ర జాతః చేన్న జీవేత్ నిరోజస్త్వాత్ ॥

శరీర స్థానము ॥ ౩ ౹౧౮ ॥

**అర్థము :-** చతుర్థమాసమునందు అంగప్రత్యంగములు వ్యక్తమగును. గర్భము, హృదయము వ్యక్తమగుటచే గర్భమును ఉత్తమ సంస్కారములచే సంస్కృతము చేయుటకు ఈ సంస్కారమును సలుపవలయును. పంచమ మాసమున మనస్సు, షష్ఠమాసమునందు బుద్ధి వ్యక్తమగుటచే గర్భముయొక్క మనోబుద్ధులను సంస్కారముచే సుసంస్కృతము చేయుట కీ మాసమున సంస్కారమొన రింపవలయును.

అష్టమ మాసమున గర్భమునకు హృదయ మేర్పడును. అపుడు గర్భిణిని దౌహృదినీయందురు. రెండు హృదయములు గలది యగుట వలన గర్భమును సహృదయము గలదిగ మార్చు మహోన్నతమైన బాధ్యత గర్భిణి పై బడును. ఆ సందర్భమున ఈ సంస్కారము చేయవలసి ఉండును.

గర్భము యొక్క మానసిక వికాసము ప్రారంభమగుటతో దానిని దృష్టియందుంచుకొని దాని యొక్క సర్వవిధ ఉత్కర్షమునకు ఆయుర్వేదాది శాస్త్రములలో పేర్కొనబడిన కర్తవ్యమును, దానికి అనుకూలమైన మానసిక, వాచిక, శారీరక కర్మలను నిర్వర్తించుట కీ సంస్కారము ప్రేరేపించును.

## ४ జాతకర్మ

ఈ సంస్కారము శిశువు జననము జరిగిన వెంటనే నిర్వహించబడును. ఇది శిశువు యొక్క అత్యున్నత, సమగ్ర జీవనముపేక్షించి నిర్వహింపబడును. ఈ సంస్కారమున శిశువునకు మధు, ఘృత మివ్వబడును. జిహ్వాపైన స్వర్ణశలాకతో "ఓ౩మ్" అని వ్రాయబడును, చెవిలో "వేదో ఽ సి" అని ఉచ్చ రించబడును. మధు, ఘృతం (తేనె,నేయి) రెండు శిశువునచే సేవింపబడును.

ఘృతము బుద్ధివర్ధకము, స్మృతి, మేధాశక్తికి అనుకూలము. జఠరాగ్నికి, ఆయుష్యమునకు వీర్యమునకు, నేత్రజ్యోతికి హితకరము. సకల జనులకు హితము చేకూర్చును. మధు హృదయమునకనుకూలము, బలకరము, నేత్రములకు హితకరము, క్రిమిహరము, విషహరము, త్రిదోషహరము, సువర్ణము ఆరోగ్యమునకు హితకరము, విషహరము, దీనిచే ఆ శిశువు రోగరహితుడు, బలశాలి, ధృడాంగు డగును. ఆయుర్వేదము ననుసరించి స్వర్ణ భస్మము కలిపి మధుఘృతమును సేవించవలయును. ఇది వైజ్ఞానికము.

శిశువు గర్భమునం దుండగా అతని అంత్రము (ప్రేవు)లలో వికృత పదార్థము లుండును. వాటిని శరీరమునుండి వేరుచేయుటకు ఈనాటి చికిత్సకులు వివిధ హానికరములగు పదార్థములను శిశువునకొసగుదురు. ప్రాచీన ఋషులు దూర దృష్టితో దర్శించి అన్నిటికన్న హితకరమైన పదార్థముగా మధువును గుర్తించిరి. తేనె వలన శిశువుకు ఎట్టి హానియు కలుగదు.

స్వర్ణశలాకతో శిశువు జిహ్వాపైన "ఓ౩మ్"ను వ్రాయుదురు "ఓ౩మ్" (పరమాత్ముని) ఆధారముగా జేసికొని ఆ శిశువు ఆధ్యాత్మపరుడై, సదాచారియై, పరోపకారియై, జితేంద్రియుడై, సంయమియై జీవింపవలె ననుటకు ఇది ప్రథమ పాఠము.

ఆధ్యాత్మిక జీవితమునకు అధ్యాత్మవిద్య అవసరము. దానికై శిశువు చెవిలో "వేదో౽సి" యను వాక్యము పలుకబడును. ఇది శిశువును మహోన్నత మానవునిగా నిర్మించుట కుపయోగపడును. దీనితో పాటు శిశువు దీర్ఘజీవి కావలయునని అనేక విధముల ఈశ్వరుని ప్రార్థింతురు.

ఇవి యన్నియు ఆ శిశువు జీవితమున కాదర్శము, దీని ననుసరించి మాతాపితరులు ఆ శిశువును మహామానవునిగా నిర్మించుటకు ప్రయత్నించ గోరుచున్నారని తెలియుచున్నది.

## ౫ నామకరణము

వ్యవహారములో ఉపయోగపడు ప్రతి పదార్థమున కొక నామ మవసరము, నామము లేక ఒక పదార్థముతో వ్యవహరించుట కఠినము, అసాధ్యము. అందుచే మానవునికి నామధేయ మవసరము. ఉత్తమార్థము గలిగి శిశువును సదా ఉత్తమ మార్గములో ప్రేరేపించగల శబ్దమే నామము. అది స్త్రీ, పురుష భేదమును తెలుపునదిగా ఉండవలయును. సరళముగను, ఉచ్చరించుట కనుకూలముగను, కర్ణ ప్రియమునై యుండవలయును. అది శిశువు జననానంతరము దశ దివసముల శుద్ధి తదుపరి ఏకాదశ దినమున కావించబడును. శిశువునకు నామ మవసరము కావున ఏదే నొక నామము నొసగవచ్చు నందురేమో కాని అటుల వీలులేదు. ఏలన మాతా పితరులు, ఆ శిశువును జీవితములో ఎటువంటి గుణములతో చూడగోరుదురో అట్టి గుణములను అలవరచుకొనుటకు ప్రేరేపించు నామమును నిశ్చయింతురు. కావున విద్వాంసులను, పూజ్యుల నాహ్వానింతురు. వారి సమక్షమున ఆ సంస్కారమును నిర్వహింతురు. ఆ నామము నుచ్చరించువారు ఆ శిశువును అదే విధముగా భావించవలయును. ఆ శిశువు మహా పురుషు డగుటకు సహకరించవలయును. శిశువు కూడా ఆ అర్థమును తెలిసికొని అటులే వ్యవహరించి మహాపురుషుడగుటకు ప్రయత్నించవలయును.

ఈ సంస్కారముచే మానవుని మహా పురుషుని చేయుటకు నామ మేవిధముగా సహకరించునో బుద్ధిమంతులు తెలిసికొనగలరు. అందులకు మాతా పితరులు, జన సామాన్యులు ఎంత బాధ్యత వహించవలసి యుండునో తెలిసికొనవలయును. మహామతిమంతులైన మన పూర్వజులు సమస్త మానవ సమాజము నుద్ధరించుటకు ఎంత ప్రయత్నించిరో దీనితో ఊహించవచ్చును.

ఇతర సంస్కారములవలె ఈ నామకరణ సంస్కారము గూడ శిశువు పైన ఉత్తమ సంస్కారము నుత్పన్నము చేయుచుండును. అర్థములేని నామములను లేదా జ్ఞాన విజ్ఞానమునకు ప్రతికూలమై అవిద్యను, మూఢాచారమును పెంపొందించు నామముల నిడగూడదు. భీరువును (పిరికివానిని), అకర్మణ్యు (సోమరి)ని జేయు నామముల నిడగూడదు. దానితో ఆ శిశువులోనే కాక ఆ నామముల నుచ్చరించువారిలో, వినువారిలో కూడ ఆ దోషములు వాటిల్లు అవకాశ ముండును.

## ౬ నిష్క్రమణము

నిష్క్రమణమనగా నిర్గమించుట = బయటకు వెళ్ళుట. శిశువును సూతికా గృహమునుండి లేక గృహమునుండి బయటకు తీసికొని వెళ్ళి భ్రమణము చేయించుట అవసరము. ప్రాచీన కాలములో ఇది జననము నుండి ద్వాదశ దినమున చేయబడు చుండెను. ౧౧ వ దినమున నామకరణము చేసిన తదుపరి నిష్క్రమణ సంస్కారము చేయుచుండిరి. తృతీయ మాసమున సూర్యదర్శనము, చతుర్థ మాసమున చంద్ర దర్శనము చేయించుచుండిరి.

శిశువు శరీరము కోమలము, అందుచే దానికి శీతోష్ణమును సహించు శక్తి అల్పము. దానిని పెంపొందించుటకు శిశువును సూతికాగృహమునుండి బయటకు తీసికొని వెళ్ళుట అవసరము, లేదా గృహమునం దంతటను త్రిప్పు టవసరము. మాతా పితరులు ఈ సంస్కారము ద్వారా శిశువు యొక్క ఉత్తమ ఆరోగ్యము కొరకు, దీర్ఘాయుష్యము కొరకు భగవంతుని ప్రార్థింతురు. ఇవి యన్నియు శిశువు ఆత్మపై ప్రభావము వేయును. అతనిలో సంస్కారము నుత్పన్నము చేయును.

## ౭ అన్నప్రాశనము

అన్నమనగా ఆహార పదార్థములు. ప్రాశనమనగా భుజించుట. శిశువు శరీరము దిన క్రమేణ అభివృద్ధి చెందును, నిరంతరము వికసించుచున్న శిశువు శరీరమున కనుకూలముగా ఆహారమాత్రయు వికసించవలయును. పైగా తల్లిపాలు క్రమేణ క్షీణించును. వికసించుచున్న శిశువు శరీరమునకు తగిన ఆహారమాత్ర అవసరము. అది కేవలము తల్లిపాలతో పూర్తికాదు. అందుచే ఆరవ మాసమున శిశువునకు ఆహారము ప్రారంభించ బడును. ప్రథమము అన్న ప్రాశన సంస్కారము ద్వారా శిశువుకు అన్న మారగింపజేయబడును.

అనేక విధముల పరిశీలించిన తరువాత ప్రపంచములో అన్నమునకు సమానమైన ఆహార పదార్థము లేదని తెలిసినది. శరీరమున కన్నమే ఆధారము. ఈ శరీరము అన్నము వలననే జన్మించును, జీవించును. ఆహారమే మహౌషధము. ఔషధములకన్న శ్రేష్ఠము అన్నమే. సుఖము, తృప్తి, స్మృతి, మేధా, ప్రాణము, బలము, తేజస్సు, ఓజస్సు,జీవనము సర్వము అన్నమే. అన్నము లేక జీవించుట అసంభవము. బండికి ఇంధనమువలె ఇది శరీరమునకవరము.

ఈ సంస్కారము నందు శిశువుకు దధి మధు ఘృతయుక్తాన్నమును సేవింపజేయుదురు. ఈ పుష్టికర ద్రవ్యములచే శిశువు శరీరము పూర్తిగా వికసించును. నిరంతరము శరీరబలము, ఉత్సాహము పెంపొందును.

రోగరహితుడై బలశాలియై, దీర్ఘాయుష్మంతుడై ప్రాపంచిక సుఖములను అనుభవించుటకు మానవుడు ప్రపంచములో తెలిసికొనవలసిన విషయము లలో ప్రథమ విషయము అన్నము. దానిని సరిగా తెలిసికొని దాని ననుకూలముగా సంయమముతో, నిష్ఠతో సేవింప ప్రయత్నించినచో మానవుడు రోగ రహితుడు, బలిష్ఠుడు, జితేంద్రియుడు, మేధావి, పరోపకారి, ఆత్మవేత్త కాగలడు. నానా రోగములచే బాధపడడు. జీవితములో పూర్ణసుఖమును పొందగలడు, ఆహార విద్యతెలియని వాడు ఆరోగ్యమును నశింపజేసికొని రోగగ్రస్తుడై ఆర్థిక, సామాజిక, ఆత్మిక బాధల ననుభవించును. అతడాత్మవేత్త యగుట బహుశ : అసంభవమేమో.

## ౮ చూడాకరణము

చూడా అనగా బంధించ బడిన కేశములు. చూడా సంస్కృత శబ్దము, అదియే వికృతమై జూడా, జూడు, జడ అని వ్యవహరించబడుచున్నది. కరణము అనగా చేయుట. చూడాకరణ మనగా శిఖనుంచుకొనుట. దీనినే చూడాకర్మయనియు నందురు కొందరు దీనిని ముండన మందురు. ముండనము సంస్కారము కాదు. శిఖను ఉంచినపుడు ముండనము సహజముగా జరుగును. ఇది అప్రధానము. ముండన శబ్దముతో ఈ సంస్కారము యొక్క మహత్త్వము స్పష్టముకాదు.

శరీరములో ౧౦౭ మర్మస్థానములు గలవని ఆయుర్వేదము పేర్కొను చున్నది. అందులో నొకటి తలపైన రోమావర్తమునందు (సుడియందు) గలదు. అదియే బ్రహ్మరంధ్ర మనబడును. దానిపైన ఆఘాతము కలిగిన ఎడల వెంటనే మృత్యువు సంభవించును. ఆ బ్రహ్మరంధ్రమును రక్షించుటకు కేశములు - శిఖా అవసరము. తలపాగయు దాని కొరకే ఉండును. శిఖా సూత్రహీనులు నిర్వహించు యజ్ఞాది శుభకర్మలు సిద్ధించవని మన పూర్వజులు భావించుచుండిరి. మగ శిశువు తలపైన రోమావర్తము గల స్థానమున అప్పుడే జన్మించిన ఆవుదూడ పాద (గిట్ట) ప్రమాణము వెడల్పుగల శిఖ ఉండవల యును. పొరపాటున శిఖ ఖండితమైనపుడు తప్త కృచ్ఛ్రమను ప్రాయశ్చిత్తము చేయవలెను. పూర్వమట్లే చేయుచుండిరి.

మనుస్మృతి యందు తప్తకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమిటుల పేర్కొనబడినది.

తప్తకృచ్ఛ్రం చరన్ విప్రో జలక్షీరఘృతానిలాన్ ।
ప్రతిత్ర్యహం పిబేదుష్ణాన్ సకృత్ స్నాయీ సమాహితః ॥ ౧౧-౨౧౪ ॥

అర్థము :- తప్తకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తము ననుష్ఠించు విప్రుడు సంయమ ముతో నుండి వరుసగా మొదటి మూడు దినములు వేడి నీటిని, తరువాత మూడు దినములు వేడి పాలను, ఆ పై మూడు దినములు వేడి నేయిని త్రాగి చివరి మూడు దినములు నిరాహారియై గడుపవలయును. దినములో నొకసారి స్నానము చేయవలయును.

ఆత్మ పరమాత్మలను సాక్షాత్కరించుకొన్న యోగులు తమ ఆత్మను బ్రహ్మరంధ్రము నుండి బయటకు తీయుదురని, బ్రహ్మరంధ్రము నుండి ఆత్మను బయటకు తీసిన వారు ముక్తులగుదురని శాస్త్రములు సూచించు చున్నవి. మానవుని జీవన లక్ష్యము ఆత్మ పరమాత్మల నెరుగుటయే, అతడు జీవితాంతము ముక్తి కొరకు ధర్మము, నీతి, పరోపకారము యోగము మున్నగు సాధనముల ద్వారా ప్రయత్నించి ఆ స్థితిని సంపాదించ వలయు నని ఈ శిఖ అతనికి సూచించును. ఆ లక్ష్యమును సూచించుటకు శిఖనుంచు టవసరము. దానిని ఈ సంస్కారముచే ప్రారంభింతురు.

శిఖను రక్షించి మిగత కేశములను తీసివేయవలయును. ఈ సంస్కారమును ఒక సంవత్సరము లోపల గాని మూడవ సంవత్సరములో గాని జరుపవలయును. దాదాపు అరు మాసముల నుండి ప్రారంభమై రెండు సంవత్సరముల అరు మాసముల వరకు శిశువు దంతములు వెడలును. అపుడు శిశువు ఆరోగ్యము శిథిలమగును. చూడా కర్మ సంస్కారము సలిపి, శిఖను రక్షించి మిగత కేశములను తీసివేయవలయును. ఈ సంస్కారము శిశువున కనుకూలముగా నుండును. వెంట్రుకలు తీసివేయుట (క్షౌరము) వలన దీర్ఘాయుష్యము పుష్టి, బలము, శుద్ధి మున్నగు ప్రయోజనములు సిద్ధించును.

## ౯ కర్ణవేధము

కర్ణవేధమనగా కర్ణములను వేధించుట, చెవులు కుట్టుట. ఆయుర్వేదము ననుసరించి కర్ణవేధము రాబోవు రోగములకు ప్రాక్చికిత్స. అనగా రోగము రాక పూర్వము చికిత్స అని అర్థము. అంత్ర వృద్ధియొక రోగము అంత్రము - ప్రేగులు క్రిందికి దిగజారుట వలన ఈ రోగము ప్రారంభమగును. అండకోశవృద్ధియు ఒకానొక రోగము. ఇది పురుషులలో సంభవించును. అంత్రములకు అండకోశములకు కర్ణములతో స్నాయు సంబంధము గలదు. దానిని వేధించుట వలన ఆ రెండు రోగములు కనబడవు. అంత్రవృద్ధి వ్యాధిగల రోగు లనేకులు ఔషధోపచారము వలన ఫలితము లేక నిరాశులైరి. చివరికి వారు కర్ణవేధ చికిత్సచే రోగముక్తులైరి. అట్టి వారు ప్రస్తుతము జీవించియే యున్నారు.

అఘాతము వలన గాని వేరొక కారణము వలనగాని అండ కోశములో నొప్పి లేక వాపు కనబడును. అపుడు ఒక కట్టెపుల్లను గాని, కలమును గాని తలకు చెవికి మధ్యలో కొన్ని గంటల వరకు ఉంచిన ఎడల నొప్పి, బాధ తాత్కాలికముగా దూరమగును. ఎడమ అండకోశములో వాపు లేక బాధ గలిగినపుడు కుడి చెవి సందున, కుడి అండకోశములో బాధ కలిగినపుడు ఎడమ చెవి సందున కట్టె పుడక ఉంచవలయును.

కాలి బొటన వ్రేలుకు త్రాడు కట్టినచో అండకోశము నొప్పి దూరమగును. అండకోశము పెరుగుట ఆగిపోవును. అదియు విలోమ దిశలో కుడికి సంభవించినపుడు ఎడమ బొటన వ్రేలుకు, ఎడమకు సంభవించినపుడు కుడి బొటన వ్రేలుకు త్రాడు కట్ట వలయును. ఈ చికిత్సకు స్నాయు సంబంధ ముండుటయే కారణము.

కర్ణవేధముతో పాటు నాసికా వేధము ఒక కర్మ. కర్ణవేధము ఆడ, మగ శిశువులకు సమానము. కాని నాసికా వేధము కేవలము ఆడవారికే అదియు అలంకారము కొరకే జరుపబడను.

## ౧౦ ఉపనయనము

ఉప = సమీపమునకు, నయనము = కొనిపోవుట. ఆచార్యుని సమీపమునకు కొనిపోవుట ఉపనయన మనబడును. మానవుడు జన్మతో ముగ్గురకు ఋణపడి యుండును. ౧ ఋషులకు, ౨ దేవతలకు, ౩ పితరులకు. మను, కపిల, కణాద మున్నగు వారు ఋషులు; విద్వాంసులు దేవతలు. జననీ జనకులు మున్నగు వారు పితరులు. వారి ఋణమును తెలిసికొనుట, దానినుండి ముక్తి కొరకు ప్రయత్నించుట విద్యచేతనే సంభవము. విద్య ప్రాప్తికొరకు ఉద్దేశించబడిన సంస్కారము ఉపనయనము; ఈ సంస్కారముచే బ్రహ్మచారి ఆచార్యునికి సమీపస్థు డగును. ఆచార్యుడు బ్రహ్మచారికి వేద విద్య నభ్యసించుటకు దీక్షనొసగును. ఈ సంస్కారానంతరము బ్రహ్మచారి ౧ ఆచార్యునికి, ౨ వేదమునకు, ౩ యమనియమాది వ్రతములకు, ౪ శుభగుణములకు సమీపస్థుడగును. ఇవి అతని వ్రతములు. అందుచే అంగిరా స్మృతి యందును, వ్యాసస్మృతి యందును ఈ సంస్కారము వ్రతాదేశ సంస్కారమని పేర్కొన బడినది. ఇది యజ్ఞోపవీత సంస్కారము కాదు.

యజ్ఞమునకు దీనికి ఏ సంబంధమును లేదు. యజ్ఞమునకు సంబంధించిన సూత్రమును యజ్ఞోపవీత మందురు. అది ఆ యజ్ఞమును సంపన్నము చేయు వరకు ధరించబడును. ఆ తరువాత తొలగించవలసి యుండును. ఉపనయనమును తొలగించుటకు వీలులేదు. ఇది సంన్యాసము స్వీకరించ నంతవరకు లేదా జీవనపర్యంత ముండును.

ఉపనయన సంస్కారము చేసికొనక వేదాధ్యయనమునకు అర్హత లభించదు. దీనితో ఉపనీతుడు వ్రతముల నాచరించి వేదాధ్యయనము నకు అర్హతను సంపాదించును. ద్వితీయ జన్మ = గురువు సమీపమునకేగి ౧ బ్రహ్మచర్యాది సద్వ్రతముల కొరకు, ౨ వేదాధ్యయనము కొరకు, ౩ యమనియమాదుల పాలనకొరకు, ౪ దివ్యగుణముల ధారణ కొరకు దీక్షను గ్రహించుటచే అతడు నూతన ద్వితీయ జన్మకు పాత్రుడగును. అపు డతడు ద్విజు డగును. సుసంస్కారములచే సంస్కృతమైన విషము కూడా భక్ష్యమగును. మట్టి కుండ యగును. దూది వస్త్ర మగును. ఇటుకలు గృహ మగును. కుసంస్కారములచే నేయి విషముగా మారును.

విద్యార్థి ఆచార్యుని సమీపించి "బ్రహ్మచర్యము కొరకు మిమ్ము సమీపించుచున్నాను. మీరు నన్ను సమీపమున నుంచుకొనుడని" ప్రార్థించును. ఆచార్యు డా ప్రార్థనను స్వీకరించును. తాను సంపాదించిన విద్యను విద్యార్థికి ప్రదానము చేయుదునని పేర్కొనును. విద్యార్థి ఆచార్యుని నుండి విద్యను గ్రహించి ప్రపంచములో విస్తరింపజేయుదునని ప్రతిజ్ఞ చేయును. ఆచార్యుడు విద్యార్థికి సూర్యుని దర్శింపజేసి అతడు సూర్యునివలె తేజస్వియై, దీర్ఘజీవియై బలముతో నొప్పు సకలేంద్రియములు గలవాడై ఉండవలయునని ఈశ్వరుని కోరును. అందుకై ప్రయత్నించుచు ఆ విద్యార్థి ఆచార్యుని చుట్టు తిరిగి ప్రదక్షిణ చేయును. భూమి సూర్యుని చుట్టు భ్రమించినటుల నేనును మీ చుట్టు భ్రమింతునని, మీ యాదేశముల పాలింతునని ఈ క్రియకు అభిప్రాయము. ఆచార్యుడు విద్యార్థి యొక్క హృదయాలంభనము చేసి తనను అనుసరించుమని పేర్కొనును. విద్యార్థియు ఆచార్యుని తాను అనుసరింతు నని ప్రతిజ్ఞ చేయును.

ఉపనయనము తర్వాత విద్యార్థి గురువును సమీపించి వేదాధ్యయనము చేయవలయును. యోగము నభ్యసింపవలయును. దానిచే అనాగరికుడైన మానవుడు కూడా నాగరికుడగును. ఉపనయనము ధరించిన వాడు దుర్గుణములను దూరముచేసికొని సద్గుణములను పొంది దివ్య మానవుడు కాగలడు. ఇది మానవ నిర్మాణము. ఈ దీక్ష, సదాచారము, యోగాభ్యాసము, వేదాభ్యాసము, సద్గుణోపాసన లేకపోవుటవలన మానవులు వివేకహీనులు, దురాచారులు, స్వార్థులు, దానవు లగుచున్నారు. మానవుని యాకారములో జన్మించినవానిని మానవునిగా మార్చుట కెవరివద్దను ఏ కార్యక్రమమును లేదు. మానవుడు మానవుడుగా అలంకృతు డగుటకు ఉత్తములైన, మాతా, పితా, ఆచార్య్య లవసరము. ఈ త్రిమూర్తులు ఉత్తము లైనపుడు సమాజము ఉత్తమ మగును. ఇదియే ఈ సంస్కార మహత్త్వము.

## ౧౧ వేదారంభము

వేదారంభమన వేదాధ్యయనము ప్రారంభించుట. ఇది ఉపనయనము తరువాత ప్రారంభించబడును. ఉపనయనముతో విద్యార్థి, ఆచార్య్య లిరువురును తమను పరస్పరము పితాపుత్రులుగా భావింతురు. ఆచార్యు డా విద్యార్థిని తన గర్భములో సమీపమున ఉంచుకొని సదాచారమును నేర్పును. అతనిని ఉత్కృష్ట మానవునిగా మార్చుటకు ప్రాతః కాలము మొదలుకొని రాత్రి నిద్రించువరకు అవసరమగు సమస్త కర్మలను, వ్యవహారములను బోధించును, అలవరచును. శరీరము, వాక్కు, మనస్సు, ఆత్మకు సంబంధించిన సమస్త విద్యలను బోధించును. వాటిని అభ్యసింపజేయుటకు ప్రయత్నించును, సమస్త ఉన్నతికి మూలమగు గాయత్రీ మంత్రమును అర్థసహితముగా జపించు పద్ధతిని బోధించును. గాయత్రీ మంత్రోపదేశము ద్వారా అపవిత్రతను, అవిద్యను వ్యవహారమునుండి తొలగించు విధానమును బోధించును. షడంగములు, షడుపాంగములు బ్రాహ్మణ గ్రంథములు, ఉపవేదములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు మున్నగు శాస్త్రములను నేర్పును.

బ్రహ్మచర్యమును పాటించుటకు కావలసిన ౨౨ బ్రహ్మచర్య సూత్రములను ఉపదేశించును. నిద్రలో కూడా బ్రహ్మచర్యము భంగము

కాకుండుట కుపయోగపడు మేఖలను ధరింపజేయును. ఆరోగ్యము కొరకు, రక్షణకొరకు అవసరమగు దండమును ప్రదానము చేయును. సమాజమున కంకితమగుటకు, ఒకే ఒక కుటుంబముతో మోహ మేర్పడ కుండుటకు, ఆత్మబలోన్నతికి, విద్యలో విఘ్నము కలుగకుండుట కవసరమగు బిక్షాటన నేర్పును. ఆచార్యుడు ఆ విద్యార్థిని తన గర్భములో ధరించును. ఇపుడా విద్యార్థికి ఆచార్యుడే జననీ, ఆచార్యుడే జనకుడు కావున అతడు ఆచార్యుని ఎడ పుత్రుని వలె వ్యవహరించు టవసరము. ఒకరి కొకరు బద్ధులై యుండుటకు హృదయాలంభనము చేయుదురు.

ఈ సంస్కారముచే వ్రతమును ధరించు విద్యార్థి నేను సత్య మనబడు వ్రతమును స్వీకరించుచున్నానని ప్రతిజ్ఞ సలుపును.

## ౧౨ సమావర్తనము

సమావర్తనమనగా వేదాధ్యయనము తరువాత గురుకులమునుండి స్వగృహమునకు తిరిగి వచ్చుట. బ్రహ్మచారి వేదము నభ్యసించి, యోగము నభ్యసించి గురుకులమునుండి తిరిగివచ్చు సందర్భమున చేయబడు సంస్కారము సమావర్తనమనబడును. సం అనగా విధిపూర్వకముగా, వేదము చదివి ఆచార్యుని అనుమతితో ఆవర్తనము అనగా తిరిగి వచ్చుట.

దీనిని కొందరాచార్యులు స్నానమందురు. ఏలన ఈ సంస్కారములో జరుపబడు స్నానము ఈ సంస్కారమందలి ప్రధాన క్రియ. ఈ సంస్కారము గృహాశ్రమమున ప్రవేశింపగోరువారి కవసరము. జీవితాంతము బ్రహ్మ చర్యమును పాటించగోరువారికి ఈ సంస్కారము వర్తించదు.

ఈ సంస్కారమున బ్రహ్మచారి ఆచార్యునికి శక్తికొలది (పరిమాణము లేదు) దక్షిణ సమర్పించును. ఇంతవరకు పాటించిన బ్రహ్మచర్య వ్రతమును వదలివేయును. ఉదా : మేఖలను, దండను విసర్జించును. సుగంధయుక్త చందనాది ద్రవ్యములను సేవించును. అందమైన వస్త్రములను ధరించును. పుష్పములను ధరించును. శిరోవేష్టనము =తలపాగ, ముకుటము, ఆభూషణాదులను ధరించును. నేత్రములలో అంజనమును వేసికొనును దర్పణమును స్వీకరించును. ఛత్రమును ధరించును. పాదుకలను ధరించును. హస్తమున అందమైన యష్ఠి = కర్రను ధరించును.

బ్రహ్మచారి మాతాపితాచార్యులకు మధుపర్కము, పుష్పమాల, వస్త్రములు గోదానము, ధనము మున్నగువాటిని దక్షిణరూపమున ప్రదానము చేయును.

## ౧3 వివాహము

పూర్ణబ్రహ్మచర్యమును పాటించి విధిపూర్వకముగ గృహాశ్రమమున ప్రవేశింపగోరువారు యుక్తవయస్సున వివాహము చేసికొనవలయును. వయః పరిమాణము, ఆరోగ్యము, శరీర ప్రకృతి, ప్రవృత్తి అభిరుచి, స్వభావము, శారీరక, మానసిక, వాచిక సామర్థ్యము మున్నగు వాటిని పరీక్షించి యౌవనము లో కుటుంబపోషణకు కావలసిన ఆర్థిక సాధనములను సంపాదించినవారు స్వయంవర వివాహము చేసికొనవలయును. పరాధీనులై వివాహము చేసికొన గూడదు. పితృగోత్రమునందును, తల్లి ఏడు తరము లందును వివాహము జరుగగూడదు. సంబంధము దూరదేశమునందు జరుపబడ వలయును. వధూవరులు బాల్యమునుండి ఒకరినొకరు చూడని వారై యుండవలయును.

మోక్షమును, ఉత్తమ సంతానముచే సమాజమును సుసంపన్నము చేయగోరువారు, అందుకు పూర్ణ సమర్థులునైనవారు వివాహమున కధికారులు. మోక్షమును, ఉత్తమ సంతానముచే సమాజమును సుసంపన్నము చేయగోరని వారు వివాహమున కనర్హులు. శారీరకముగ అసమర్థులైనవారు సమావర్తనము నకనర్హులు. ప్రాచీనకాలములో వారికి శాస్త్రానుసారముగ స్వీకృతి లేకుండెను. మోక్షమును, సమాజోన్నతిని కోరనివారికి పూర్ణసమర్థులు కానివారికి ఈ సంస్కారము చేయకూడదు. గృహాశ్రమము పరాధీనము భార్యకు భర్త, భర్తకు భార్య ఆధీను లగుదురు. వారిరువురు కలిసి వేదోక్త యజ్ఞయాగాదులను నిర్వహించవలయును. గృహ్యసూత్రములలో పేర్కొనబడిన పంచమహా యజ్ఞములను అనుదినము నిర్వర్తింపవలయును. ధర్మ సూత్రములలో పేర్కొనబడిన ధర్మమును ఆచరించవలయును. ఈ కర్మలను ఎన్నడును వదల వీలులేదు. వదలిన ఎడల అది పూర్ణగృహాశ్రమము కాదు. ఎన్ని బాధలు సమీపించినను ఇరువురు విడిపోగూడదు. ఇరువురు పతివ్రత, పత్నీవ్రత నియమమును పాటించవలయును. స్వసంతాన పాలించుచు రాష్ట్రమునకు సంబంధించిన కర్తవ్యములను పాటించ వలయును. ఉత్తమ సంతానమును

నిర్మించుటకు ముఖ్యముగ శ్రద్ధ వహించవలయును. దీనితోపాటు జీవన నిర్వాహము కొరకు వేదధర్మానుకూలమైన కర్మలనే ఆచరించవలయును. పది మందికన్న అధిక సంతానము ఉండ గూడదు. దీర్ఘాయుష్యము ననుభవించునటుల ఉత్తమ ఆరోగ్యముగల సంతానమును ప్రయత్న పూర్వకముగ సంపాదించ వలయును. అందుకు దంపతులు కూడా ఆరోగ్యవంతులై, ఆదర్శవంతులై యుండ వలయును.

ఈ విషయములు సంస్కారము నందలి ప్రధానహోమము, జయాహోమము, అభ్యాతన హోమము, పాణిగ్రహణము, శిలారోహణము, లాజాహోమము, కేశవిమోచనము, సప్తపదీ, సూర్యదర్శనము, హృదయా లంభనము మున్నగు క్రియలచే బోధింపబడినవి.

ఇరువదియైదు సంవత్సరముల వరకు గృహాశ్రమ ధర్మమును పాటించి తరువాత వనాశ్రమమును స్వీకరించవలయును.

## ౧౪ వానప్రస్థము

గృహాశ్రమ కర్తవ్యమును పూర్తి చేసికొని వానప్రస్థము స్వీకరించ వలయును. గృహాశ్రమము, సంన్యాసాశ్రమము ఐచ్ఛికములు. అనగా సామర్థ్యము కలిగినపుడు వానిని స్వీకరించవలయును. బ్రహ్మచర్యము, వానప్రస్థము ప్రతిమానవుడు తప్పనిసరిగా స్వీకరించవలయును. దీనిలో వికల్పముండదు.

వనస్థులు కాగోరువారు గ్రామములో ఉత్పన్నమగు ఆహారపదార్థము లను వదలవలయును. గృహమునందలి వస్తువులను త్యజించవలయును. భార్యను పుత్రులవద్ద వదలి వనమునాశ్రయించవలయును. ఒకవేళ భార్యతో పాటు వెళ్ళిన ఎడల బ్రహ్మచర్యమును పాటించవలయును.

అగ్నిహోత్రమునకు సంబంధించిన సకల పదార్థములను వెంటనిడుకొని గ్రామమును వదలి అడవిలో నివసించవలయును. నిత్యము స్వాధ్యాయము చేయుచుండవలయును జితేంద్రియు డగుటకు యత్నించవలయును. ఎవరి

నుండి ఏమియు స్వీకరించకూడదు. వనవాసులగు గృహస్థుల నుండి, తపమాచరించు వారినుండి భిక్షాటన చేయవలయును. స్వాధ్యాయముచే ఆత్మపరమాత్మలను తెలిసికొన యత్నించవలయును. పూర్ణవైరాగ్య ముదయించువర కిటులే జీవనము గడుపవలయును.

## ౧౫ సంన్యాసము

సంన్యాసము అనగా దేనిమూలమున విద్వాంసుడు సమస్త అధర్మాచరణనువీడి ప్రతి నిత్యము సత్కర్మలలో స్థిరపడునో అది సంన్యాసము. సంన్యాసము గలవాడు సంన్యాసి.

పూర్ణ అఖండిత బ్రహ్మచర్యమును పాటించినవాడు, జ్ఞానవిజ్ఞానములు గలవాడు, విషయాసక్తిని ఆత్మనుండి పారద్రోలినవాడు, పక్షపాతరహితుడై సకలప్రాణుల కుపకారము చేయగోరువాడు, తాను మరణపర్యంతము సంన్యాస కర్తవ్యము పూర్తిగా పాటించగలనను ఆత్మవిశ్వాసము గలవాడు, వానప్రస్థాశ్రమమునుండి గాని, గృహాశ్రమమునుండి గాని బ్రహ్మచర్యము నుండి గాని సంన్యాసమును స్వీకరించవలయును. సర్వసంగ పరిత్యాగియైన వాడు సంన్యాసమును స్వీకరించవలయును. సర్వత్ర సంచరించవలయును. సకల ప్రాణుల సుఖముకొరకు ప్రయత్నించవలయును. సకల ప్రాణుల కభయదాన మివ్వవలయును. జీవన మరణములను లెక్కించగూడదు. ఎవరితో ఏమి ఆశించగూడదు. స్వామి యాజ్ఞకై సేవకుడు ప్రతీక్షించినటుల మృత్యువును ప్రతీక్షించవలయును. యోగము నభ్యసించుచు మోక్షము కొరకే ప్రయత్నించ వలయును.

జీవితములో పరమవిజ్ఞానమును సంపాదించినవాడు, రాగద్వేషరహితు డైనవాడు, ఎవరితో ఏమి ఆశించనివాడు, తన సర్వస్వమును సకల జీవుల సుఖముకొర కర్పించుట కహర్నిశలు ప్రయత్నించువాడు, అపకారులకు సహితము ఉపకారము చేయువాడు నివసించుదేశము సమున్నతమేల కాదు? ఇటువంటి మహోన్నత మానవులు గల దేశము సర్వవిధముల ఉన్నతిని సంపాదించి శాంతికి నిలయము కాకుండునా ?

## ౧౬ అంత్యేష్టి

దీనినే అంత్యకర్మ, నరమేధము, నరయాగము, పురుష యాగ మందురు. శరీర సంస్కారము భస్మపర్యంతము జరుగును. శరీరము నుండి ఆత్మ గతించిన తదుపరి శరీరము నిరుపయోగము. అది దూషిత పదార్థము. దానివలన జీవించియున్న ఇతర ప్రాణులకు అపకారము కలుగకుండుటకు గతించిన వ్యక్తిని సత్కరించుటకును అంత్యేష్టి జరుప బడును.

శరీరమును శ్మశానమునకు గొనిపోయి వేదోక్తముగా ఉత్తమ ఔషధము లతో, నేయితో వేదమంత్రములనుచ్చరించుచు దహనము చేయవలయును. కాష్ఠములపైన ఉత్తరదిశలో శిరస్సునుంచి పైనుండి చందనాది కాష్ఠములను, ఔషధముల నుంచి శరీరమును నిశ్శేషముగా దహనము చేయవలయును. తృతీయ దినము శ్మశానము నుండి అస్థులను సంగ్రహించి మట్టి పాత్రలో నింపి మానవులు, పశు పక్ష్యాదులు స్పర్శించకుండునటుల దానిని భూమిలో పూడ్చవలయును. గతించిన ఆత్మకు కుటుంబీకులకు మధ్య ఏ సంబంధము లేదు. ఆ ఆత్మ ఎచ్చటనున్నదో ఎవరికి తెలియదు. అందుచే మరణించిన తరువాత దహనము చేయబడిన ఆ శరీరము గూర్చి చేయవలసి ఏ కర్మ మిగిలి యుండదు. గోరీలు మున్నగునవి నిర్మించగూడదు. తాము అర్పించిన భోజనము వస్త్రములు మున్నగు ద్రవ్యములు గతించిన ఆత్మకు లభించు ననుకొని ఎవరికో ప్రదానము చేయకూడదు. శవమును స్పర్శించిన వారు పదిదినములవరకు ఇతరులను స్పర్శించకూడదు. ఆ గృహమున దశదినములవరకు ఉదయము, సాయంత్రము దైనికాగ్నిహోత్రము గావించ వలయును. శవమును భూమిలో పూడ్చుట, నీటిలో ప్రవహింపజేయుట, వనమున వదలుట మున్నగు క్రియలు హానికరములగుటచే సర్వథా వ్యర్థములు.